సంపుటము 4] ఫిబ్రవరి, 1918 [సంచిక 8

# బాలమిత్ర



## "రత్నముయొక్క చిన్నిచప్పట్లు"

పాటూరుగ్రామము జిల్లాకు చివరనున్నది. ఆ జిల్లాకును తక్కిన వానికిని మధ్యను మలయు పర్వతములు గలవు. పాటూరు అంతపెద్దగ్రామముకాదు. చాల సంవత్సరముల క్రిందట తురకవారి ప్రభుత్వములోవచ్చిన సిద్దివారు ఆ గ్రామమున కాపురముండిరి. వారిలో వెంకటసాహేబను వాడు గలడు. వాని భార్య చనిపోయెను. ఆమె కొక్కడే కొడుకు. వానికి రత్నమనుపేరు. వాని 7 సంవత్సరముల ప్రాయమప్పుడు తల్లి కాలముచేసెను. చావకముందు ఆమె

లోకరక్షకునిగూర్చి విని నమ్మెను. ఈ సంగతి వెనిమిటికి దెలియదు. అప్పుడప్పుడు తన కుమారునికి ఆ రక్షకునిగూర్చి చెప్పియుండెను. రత్నము చిన్నపిల్లవాడుగాన ఇప్పుడా సంగతులు అంతగా జ్ఞాపకము లేవు

భార్య చచ్చిన కొన్నాళ్లకే వెంకటసాహెబు మరియొక స్త్రీని వివాహమాడెను. మారుతల్లి పోరుబడలేక రత్నము బహుశ్రమ పొందెను. తండ్రి తన్ను నిరాదరణతో జూచుటను సహింపజాలక పోయెను. వాని నాదరించి కరుణించువారు యెవరును లేకపోయిరి. వానియొద్ద ఒక ముద్దుకుక్క గలదు. దానిపేరు "చిన్ని చప్పట్లు" అది పిల్లగా నుండునప్పుడు రత్నము చప్పట్లు కొట్టిన నదియు ఆలాగే నేలమీద కాళ్లతో గొట్టుటకు నేర్చుకొనెను. గాన వాడు దానిని "చిన్ని చప్పట్ల"ని పిలుచువాడు.

"చిన్ని చప్పట్ల"న్న రత్నమున కెంతో ప్రేమ. దానిని యెప్పుడు వెంటదీసికొని పోవువాడు. తన గిన్నెలో తిననిచ్చువాడు. కుక్కయని వానికి అసహ్యము పుట్టలేదు. దాని చేష్టలు వానికంత ప్రీతిగానుండెను. అదియు వాడును ఒక్క కంచములో దిని ఒక్క పక్కపై పండుకొనువారు. ఆ కుక్క అందరికిని ముద్దుగోలుపునదే. అది కడగ్రామ మైనందున ఆ గ్రామములో మరియొక కుక్క లేకపోయెను. చుట్టు ప్రక్కల వేరు గ్రామములును లేవు.

ఆ గ్రామమునకు రెండుమైళ్ల దూరములో నొక వైద్యుడు గలడు. అతడు మంచి మర్యాదపరుడు. అతని యెరుగని వారు ఆ ప్రాంతములలో లేరు. అతడు చాల కష్టపడి చివరకు ఒక మంచి మందును కనుగొనెను. దానివలన లోకమునకు యెంతో మేలు కలుగునని దలంచెను. గాన దానిని పరీక్షింపవలసి యుండెను. ఈ మందును మానవుల మీదనైనను, కుక్కల మీదనైనను ప్రయోగించవలసివచ్చెను. మానవులలో నెవడు నీ పనికి ఒప్పుకొనడని తలంచెను. కుక్కలు ఆ గ్రామమున లేకపోయెను. గాన రత్నము కుక్కను గొన నిశ్చయించెను. ఒకనాడు వెంకటసాహెబునొద్దకువచ్చి కుక్కను బేరమాడి 5 రూపాయలకు గొన నిశ్చయించి పావలా బయానా యిచ్చి కుక్కను తన యింటికి పంపుమనియు, అది వచ్చినపిదప తక్కిన నాలుగుముప్పావులా నిత్తునని జెప్పెను. అతడు తన యింటికి బోవునప్పుడు రత్నము కుక్కతో గలిసి చెట్టుక్రింద యాడుకొనుట కనుబడెను. అంతట అతడు ఆ కుక్కను జూచి అబ్బాయీ! "అదేనా మీ కుక్క?" అని యడిగెను.

రత్నము:—"అది నాకుక్క దానిపేరు చిన్నిచప్పట్లు."

వైద్యుడు:—"తమాషాపేరు. ఇదిగో దానిని నేనుకొన్నాను. దానితో నొకపని జేయవలెను. నీవు దానిని నా యింటికి దెచ్చెదవా?"

రత్నము:—"అది నాది. నీ వెట్లు గొందువు. నేను దానిని అమ్మను."

వైద్యుడు:—"మీ నాయన దానిని నాకు అమ్మెను. అది తప్పక నాకు కావలెను. నీవు దానిని సాయంకాలము మా యింటికి దెచ్చినయెడల నీకు అర్థరూపాయ నిత్తును." అని చెప్పి వెళ్లిపోయెను.

ఎందుకో రెండు మూడు దినములనుండి వాని మారుతల్లి కుక్కను కసిరి కొట్టుచు వచ్చెనని వాని కప్పుడు తోచెను. తన మారుతల్లికి ఇష్టము లేనియెడల తప్పక తన తండ్రి దానిని దూరముగా పంపివేయునని వానికి దెలియును. అది కఱవుకాలము. గింజల ధర జాస్తిగా నుండెను. ఒక కుక్క 5 రూపాయలకు అమ్ముడు పోయినయెడల రెండు మాసము లకువచ్చు జొన్నలు కొనవచ్చునని వెంకటసాహెబు ఆలోచించెను.

రత్నము ఇంటికి రాగానే తండ్రి వానిని పిలిచి సాయంకాలము యేడు గంటలకు కుక్కను వైద్యుని యింటికి దీసికొని పోయి 4 రూపాయల 12 అణాలు పట్టుకొని రమ్మనెను. రత్నము ముఖములో రక్తపుచుక్క లేకపోయెను. మారు మాట చెప్ప వీలులేకపోయెను. మాటలాడకుండ దానిని వెంటబెట్టుకొని తల్లిని పాతిపెట్టిన స్థలమునకు బోయెను. ఆ సమాధి తలవైపు మంచి వేపచెట్టు మొలిచెను. దాని నీడను

వాడు కూర్చుండి కుక్కను కౌగలించుకొని యేడ్చెను. దానిని ముద్దాడెను. దాని శరీరము నిమిరెను. భోజనము వేళ యయినను ఇంటికి బోలేదు. ఉన్న కొంచెము కాలమైనను దానితో గడుపదలంచెను. అతని తలంపులు పరిపరి విధముల బోయెను. వైద్యుని కిచ్చినయెడల వాడు దానితో నేమి చేయునో తెలియదు బహుశా చంపునేమో? చంపినయెడల తన ప్రియకుక్క, తన ప్రియతల్లియున్న స్థలమునకు బోవలె నని కోరెను. ఆమె సగము ఆ చెట్టుక్రింద నున్నది. రెండవ సగము వేరొక స్థలములో నున్నది. అక్కడికి అతడు రావలె నని తల్లికోరినది. తానక్కడకు బోయినయెడల తనప్రియ కుక్కయు అక్కడకు బోవలెనని అతడు కోరెను. ఇట్లతడు తలంచుచుండగానే వానికి తెలియకనే చీకటిపడెను. సరిగా ఏడు గంటలకు వైద్యునియొద్దకు బోవలెను గాన తా నొంటరిగానే లేచి కుక్కను అక్కడనే విడిచివెళ్లెను.

వెళ్లి తలుపు తట్టెను. ఒక నౌకరు వచ్చి పేరు అడిగెను. వానిపేరు కనుగొని లోనికివెళ్లిన కొంచెపు సేపటికి ఎంతో సంతోషముతో వైద్యుడు వచ్చెను. గాని చూచినప్పుడు కుక్క లేదు. కోపము వచ్చెను.

వైద్యుడు:—“కుక్కనెందుకు తేలేదు?”

రత్నము:—“కుక్క లేదు.”

వైద్యుడు:—“ఏమయినది?”

రత్నము:—“అమ్మ యొద్దకు బోయినది.”

వైద్యుడు:—“ఎక్కడికి! మీ అమ్మ ఎక్కడున్నది?”

రత్నము:—“ఏమో నాకు దెలియదు. తాను చనిపోకముందు తనలో మంచిసగము ఎక్కడకో మంచి చోటునకు బోవుననియు, చెడ్డసగము ఇక్కడనే ఉండు ననియు చెప్పినది. నేను ఒక సగమును, అమ్మదగ్గ రకుబంపి, రెండవ సగమును, అమ్మ చెడ్డసగము దగ్గర ఉంచితిని.”

వైద్యుడు:—“ఎందు కట్లు జేసితివి?”

రత్నము:—“నా కుక్క నాదగ్గర నుండవలెను. మీదగ్గర నుండుటకు దాని కిష్టములేదు. నేను దాని నా దగ్గర నుంచలేను. గనుక నా ప్రియతల్లియొద్దకు బంపితిని. నా కుక్కతో జేయవలసినపని నాతో జేయుడి. మీరు నాకు డబ్బు ఇవ్వనక్కరలేదు.”

ఈ మాటలు వినగానే వైద్యుని కన్నులవెంట నీరువచ్చెను. వెంటనే రత్నమును కౌగలించుకొని, “బిడ్డా! నీ కుక్క నా కక్కరలేదు. నీవు నాకు కావలెను. రమ్ము త్వరగాబోయి కుక్కను జూతము” ని ప్రేమతోజెప్పి వానితో కలిసివెళ్లి సమాధిమీద చచ్చినట్టు పడియున్న “చప్పట్ల” నెత్తి దాని మూతికి గట్టబడిన త్రాటిని విప్పెను. కొంచెము సేపటిలో అది గాలిని పీల్చుకొనిలేచి రత్నముపైబడి వాని నాకసాగెను.

వైద్యుడు వారి స్నేహమును జూచి, మిగుల ముచ్చటపడి, రత్నము తండ్రికి 50 రూపాయలిచ్చి రత్నమును తాను పెంచుకొని చదువు చెప్పించి గొప్పవానిగా జేసెను.

---

## ఆవు దూడ



పిల్లలారా! పై పటములోనున్న బొమ్మ ఏమిటో మీకు తెలియునా? అది యొక ఆవుదూడ. అది యేమిచేయుచున్నది? అది తన తోకను పైకెత్తి చెవులను నిక్కించి, కాళ్లను కొంచెమువంచి, మెడనుచాచి, ఎంతో సంతోషముతో నటునిటు గంతులు వేయుచున్నది. అది యెందుకట్లు చేయుచున్నదో మీ రెఱుగుదురా? అది దూరముననుండి వచ్చుచున్న తన తల్లినిచూచి, సంతోషముతో దుముకులాడుచున్నది. దాని తల్లి ఈ పటమందు కనబడుటలేదు. మీరు మీ తల్లిని చూచినప్పుడు పరుగెత్తుకొనిపోయి, కౌగలించుకొని ఎంతో సంతోషముతో మాటలాడుదురుగదా! అట్లెందుకు

చేయుదురు? మీ తల్లి మీకు చిన్నప్పటినుండి పాలిచ్చి ఎంతో ప్రేమతో పెంచి పెద్దవారగుకొలది అన్నము, బట్టలు, ఇచ్చి చదువును చెప్పించుచు ఎంతో దయతో జూచుచుండుట చేతనే గదా! అట్లే ఆవుకూడ తన దూడకు పాలనుయిచ్చి యెంతో దయతో పెంచును. దూడ పాలుకుడుచుచుండగా తల్లి దూడ శరీరమును నాకుచు ప్రేమను కనబఱచుచుండును. మనము దూడను పట్టుకొనబోయినను కొట్టబోయినను, దాని తల్లి బుస్సుమని మనలను పొడవవచ్చును. దూడ ముందుగా పాలు కుడువనిదే కొన్ని యావులు యజమానునికి సరిగా పాలియ్యవు. కొన్ని యావులు యజమానునికి సరిగా పాలియ్యక ఎగజేపి, దాచి తమ బిడ్డలకిచ్చును. ఆహా! పశువులకు తమ బిడ్డలయందు ఎంతప్రేమయో చూచితిరా! మఱియు దూడయు తన తల్లియందెంతో ప్రేమగానుండును. తల్లి ఎచ్చటికి పోయినను దూడ దానివెంటనే పోవుచుండును. దూడను మనము ఎత్తుకొనిపోవుచుండగా తల్లియావు మన వెంటనే పరుగెత్తుకొని వచ్చుచుండును. బాలులారా! తెలిసికొంటిరిగదా పశువులుకూడ తమ బిడ్డలయందు తల్లికి, తల్లులయందు బిడ్డలకు ఎంతప్రేమయో! మనమును మన తల్లిదండ్రులయందు ఎల్లప్పుడును ప్రేమగలిగి విధేయులమై యుండవలెను.



# అక్కా, చెల్లె



వనమెంత గొప్పది - వందలు పూలు
యెక్కడ జూచిన - నెఱ్ఱని పూలు
కొల్లలు కొల్లలు - కోరిన పూలు
తెల్లని విదుగో! - మల్లే పూలు
యెర్రని విదుగో! - రోజా పూలు
అన్ని చెట్లకు - నున్నవి పూలు
చెలువుగ నున్నవి - చేమంతి పూలు
యెంతో చక్కని - బంతి పూలు

చెల్లెల! నీకు - చిన్ని పూలు
ఎంతో చక్కని - ఎర్రని పూలు
యెర్రని వెల్ల నీకు
తెల్లని వెల్ల నాకు

---

## ఆరేండ్ల కుఱ్ఱవాడు చేసిన కార్యము

కొరియా దేశములో నారేండ్ల బాలుడొకడు, తన ఊరి యందున్న తక్కినవారివలె, క్రీస్తు సువార్త ప్రకటన కొరకై ఇవ్వలేకున్నందున ఒకనాడు చాల దుఃఖించెను. వారందరు తమ సంపాదనలోనిది కొంచె మిచ్చిరిగాని పాపము వీనికేమున్నది ఇచ్చుటకు?

చివర కతను తన తండ్రియొద్దకు చాల సంతోషముతో బోయి, "నాయనా! ప్రతిమాసము మొదటిదినము నేను భోజనముచేయక ఒక సంవత్సరమువరకు దానిని చందాగా నిత్తును" నెను. ఆ వయస్సులోనున్నవారు దినమునకు రెండు మారులు భోజనము మానుకొని దానిని సువార్త వ్యాపనకై ఇచ్చుటెంత మంచి తలంపు!

---

# కాంతయ్య

మాణిక్యమ్మ తన స్నేహితురాలగు రత్నమ్మగారి ఇంటికి బోయి రాత్రి యక్కడనే గడిపి ఇంటికివచ్చు నప్పటికి పదిగంటలాయెను. (మాణిక్యమ్మది వేరే గ్రామము. ఆమె ఇక్కడికి బడిపనిమీదవచ్చి తన స్నేహితులలో నొకరి ఇంట బసచేయుచున్నది.) ఆమె వచ్చునప్పటికి ఇంటిలో నొక క్రొత్తపిల్లవా డగుపడెను. అత డామెను జూచిన వెంటనే లేచి "సలామమ్మా! మాణిక్యమ్మగారూ! బాగు న్నారా? దయచేయుండి" యని కుర్చీవేసెను. మాణిక్యమ్మ గోడుగు మూలనబెట్టి, "నీ వెవరవో నాకు తెలియదే. ఎప్పుడు వచ్చితివి?" అని యడిగెను. "నేటి ఉదయమున వచ్చితిని. నా పేరు కాంతయ్య. మాబడికి సెలవులిచ్చిరి గనుక మా బావగారిని జూచిపోవచ్చితిన"నెను.

మధ్యాహ్న భోజనమప్పుడు అతడు చాల చురుకుగా నుండెను. అందరికి భోజనమునకు తానే పీటలు వేసెను. నీళ్లుపెట్టెను. తాను తినుచునే, ఇతరుల కేమేమి కావలెనో కనిపెట్టియే యుండెను. కూర అయిపోయినవారి కది యందిచ్చుచు, నీళ్లుకాగానే పాత్ర నిండ పోయుచు, అన్నము వడ్డించుకొనుడని చెప్పుచు అందరితో సంతోష

ముగా మాటలాడెను. మాణిక్యమ్మ అతని జూచి యిట్లు తలంచెను. "కాంతయ్యతల్లి చాల జాగ్రతగలది. పెద్దలను మర్యాదచేయుటకు, ఇతరుల విషయములనుగూర్చి ముందుగా విచారించుటకు నితనికి నేర్పినది. ఇతరు లెవరైనను వచ్చిన యెడల లేచి వారికి మర్యాదజేయుట వీనికి బాగుగా తెలి యును. స్వంతమేలును విచారించుకొనువాడుగాక ఇతరుల యవసరములను తీర్చ యత్నించు కాంతయ్య, అనేకమంది బాలురకంటె ఎంత శ్రేష్ఠుడు" అని తలంచెను. అతని అక్క మాణిక్యమ్మతో "వీడు తల్లికెంతో సహాయకారి. సంతోష ముతో ఆమె కన్నిపనులలో సహాయపడును. ఎక్కడ ఉన్నను ఇతరులమేలు కోరునుగాన అందరును వానిని మిగుల ప్రేమింతుర"ని చెప్పెను.

---

# బైబిలు పిల్లలు

## మనుష్యులందరిలో జ్ఞానవంతు డెవడు?

బహుకాలము క్రిందట సొలోమోను అను పేరుగల రాజుండెను. అతడు చిన్నవయస్సులో నుండగనే జ్ఞానము సంపాదింపవలెనని, విద్యను జాగ్రత్తగ నేర్చు కొనెను. చిన్నపురుగులను, పక్షులను, జంతువులను, నక్షత్ర



ములను నిదానించి చూచెడివాడు. పడుచువాడుగ నుండగనే చిన్నవిషయములను వ్రాయ మొదలుబెట్టెను.

సొలోమోను తల్లి మిగుల తెలివిగలది. తండ్రియగు దావీదు మహారాజు కవీశ్వరుడు, చక్కని దొడ్డబుద్ధిగల వాడు. సొలోమోనుకు పట్టాభిషేకముచేసిన రాత్రిలో ఆయనకు ఒక కలవచ్చెను. అందులో నీవు కోరుకొనునది నీ కిచ్చెదనని దేవుడు చెప్పగా సొలోమోను తనకున్న జ్ఞానము రాచరికము చేయుటకు చాలదని గ్రహించి తనకు జ్ఞానము యిమ్మని కోరుకొనెను. మనమైతే గొప్పమేడలు కావలెనని, చాల డబ్బుకావలెనని కోరుకొనెడివారమే, గదా? అన్నిటి

కంటె మించినది జ్ఞానమే. ఇట్టి కోర్కెను దేవుడు మెచ్చి ఆయనకు జ్ఞానముమాత్రమేకాక చాల డబ్బును గొప్పరాజ్యమును, సుందరమైన మేడలను, ఘనమును ఇచ్చెను. అతడు దేవునికి విధేయుడై యుండినయెడల అతను ఎక్కువకాలము జీవించియుండెడివాడే. బంగారముకంటె, నగలకంటె శ్రేష్ఠమైనవి ఏవి? మనము ఎట్టివానిని కోరవలెను. బీదలయెడల కనికరము చూపవలయును. న్యాయమునే చేయవలయును. లోకములో మేలుచేయుచు కాలముగడుపవలయును. చిన్నపిల్లలమైన మనము ఇతర పిల్లలయొక్క రక్షణ వెదకవలెను!

---

## బాలమిత్ర టపా

ప్రియమైన సహోదరీలారా! నేను చిన్నబిడ్డగా యుండినప్పుడు మిషన్‌బడిలో చదువుటవల్లను, దేవుని వాక్యము బహు కొద్దిగా నేర్చుకొని క్రీస్తు బిడ్డనగుటకు చాల ఆశపడితినిగాని నా తల్లియొక్క ఆటంకమువల్ల వీలులేకపోయెను. అయితే తగిన సమయము వచ్చినప్పుడు దేవుడు తన సేవకులద్వారా సహాయమిచ్చి ఈ మార్గమునకు నడిపించెను. నేను నా స్వగ్రామమును, బంధువులను విడుచుటకు భయపడితినిగాని నేను ధైర్యముపొంది నా స్వగ్రా




మమును బంధువులను విడచి క్రీస్తును వెంబడించితిని. బైబిల్ నేర్చుకొనుటకు వినుకొండబడికి వచ్చితిని. నేను 1916 సం॥ బైబిల్‌బడిలో ప్రవేశించి దేవునివాక్యము నేర్చుకొనుచూ ఆత్మయందు యెక్కువ అభివృద్ధి పొందుచున్నాను. ఈ బైబిల్ బడిలో నేను ప్రవేశించినప్పుడు 15 మంది పిల్లలుండిరి. వారిలో 5 గురు పిల్లలు 1917 సం॥ ఏప్రిల్ నెలలో కృతార్థులైవెళ్లి తమ తమ గ్రామములయందు పనిచేయుచున్నారు. ఇప్పుడు మాబడిలో 9 మంది పిల్లలుమాత్రమే యున్నాము. వారిలో 5 గురు పిల్లలము రెండవతరగతి చదువుచున్నాము. 4 పిల్లలు మొదటితరగతియందు చదువుచున్నారు. రెండవ తరగతికి డబ్లియు. బి. బౌగ్సు దొరసానమ్మగారు, దైవ వాక్యము ఎక్కువ ఆసక్తితోను, ప్రేమగాను నేర్పించుచున్నారు.

ప్రియతల్లిగారు మమ్ములను తల్లిదండ్రులకంటె ఎక్కువగా ఆత్మయందును, శరీరమందును బహు జాగ్రత్త తీసికొని నడిపించుచున్నారు. మొదటితరగతికి బి. ఎమేల్యమ్మగారు ఎక్కువ ఆసక్తితోను, ప్రేమగాను నేర్పించుచున్నారు. దీని చదువు ప్రియ సహోదరీలారా! మీరున్ను ఈ బడికి వచ్చి అనేక గొప్ప సత్యములను నేర్చుకొనుటకు ప్రయత్నించవలయునని మనవి చేయుచున్నాను. ఈ లోకసంబంధమైన విద్యలన్నిటిలో దేవుని వాక్యము మనకు ముఖ్యమైయున్నది. కీర్తన 119: 9-105.

ఇట్లు మీ విధేయురాలు

జి. బంగారమ్మ,

బైబిల్ పాఠశాల, వినుకొండ

గుంటూరు జిల్లా

C. L. S. PRESS, MADRAS—1918